# నటభారతి నాగేశం స్మారకోపన్యాసము - 1994

## " నాటకాలలో హాస్యం "



ఉపన్యాసకులు :

డా. ముట్నూరి సంగమేశంగారు



ప్రచురణ

శ్రీ నాగేశం స్మారక సమితి

716, భవానీనగరు, తిరుపతి-517 501.

కె. వి. సుబ్బరామయ్య
అధ్యక్షులు.

కె. వి. నరసింహమూర్తి
కార్యదర్శి.

శ్రీ నాగేశం స్మారక సమితి ప్రచురణ 1994

ప్రతులకు :
కె. వి. నరసింహమూర్తి
కార్యదర్శి
శ్రీ నాగేశం స్మారక సమితి
716, భవానీనగర్,
తిరుపతి-517 501.

మూల్యము: మూడు రూపాయలు

ముద్రణ
టి. వి. ప్రెస్
తిరుపతి.

# నాటకాలలో హాస్యము

డా॥ ముట్నూరి సంగమేశం

హాస్యం జీవితానికి ప్రాణం. దుఃఖం మనిషిని క్రుంగదీస్తుంది హాస్యం ఉత్సాహానిచ్చి ఉద్ధరిస్తుంది. అయితే యిది ఎక్కువ కాకూడదు వంటకాల్లో ఉప్పులాటిది. ఎక్కువైతే వికటిస్తుంది. అందుకే నవ్వు నాలుగువిధాలచేటు అనీ నలుగురిలో నవ్వకూడదు అనీ పెద్దలు చెప్తూ వుంటారు. శాస్త్రంలో కూడా నవ్వు, లేదా హాస్యాన్ని ఆరు రకాలుగా వర్ణించి. ఉత్తమ, మధ్యమ, అధమ తరగతులుగా విభజించి చెప్పారు చిరునవ్వు (స్మితం) పలువరుసచూపే నవ్వు (హసితం) అనేవి రెండూ ఉత్తమ తరగతికి చెందేవి. పకపకమని నవ్వడం (విహసితం) తల పంకించి మరీనవ్వడం (ఉద్ధసితం)అనేవి మధ్యమతరగతికి చెందుతాయి కళ్లంటనీళ్లు వచ్చేలా నవ్వడం (అవహసితం) కాళ్ళుచేతులు ఆడించి కడుపు నొప్పివచ్చేలా నవ్వడం (అతిహసితం) అధమ కోటికి చెందుతాయి కాగా ఉత్తమ కావ్యాలలోగాని, ఉత్తమ జనులలోగాని నవ్వు కొంతవరకు హద్దులలోనే ఉంటుంది.

కావ్యనాటకాలదులలో ధీరోదాత్తాది ఉత్తమ పాత్రలు ప్రధానపాత్ర వహిస్తాయి.అందుచేత అక్కడ ఉదాత్త గంభీరమైన వాతావరణంఏర్పడి హాస్యానికి అవకాశమివ్వదు అందుకే వాటిలో వీరశృంగారాలే ప్రధాన రసాలుగాఉండాలన్నారు.కాని ఆవీరశృంగారాలకి తోడుగా సంచారిగానో సహాయకారి అంగరసంగానో హాస్యం ప్రయోగించవచ్చునని చెప్పారు ఇలా ఉత్తమ పాత్రలతో కాకుండా మధ్యమాధమ పాత్రలతో నిర్వహింపబడే ప్రహసనాదులలో హాస్యాన్ని అంగిరసం (ప్రధానరసం) గా వాడుకోవచ్చు నన్నారు. దశరూపకాల్లో భాణం, వీధి, అంకం,

ప్రహసనం అనేవి హాస్యాన్ని ఆదరిస్తాయి ఆలాగే ఉపరూపకాలలో నాటిక. ప్రస్థానకం (దాసదాసీ వ్యాపారం) రాసకం(మూర్ఖనాయకచరిత్ర) గోష్ఠి (ప్రాకృత సంభాషణాదికం) త్రోటకం (ప్రతి అంకంలోనూ విదూషకుడుంటాడు) విలాసిక (విటవిదూషాదుల విలాసం) వంటివెన్నో హాస్యరస ప్రయోగానికి అనువైన రచనలు.

నాటకం దృశ్యకావ్యం. ఇందులో సంవాదం లేదా సంభాషణకు ప్రాముఖ్యముంటుంది. కాగా యిది వాచికాభినయ ప్రధానం. అందుకని హాస్యస్ఫూర్తికి అనువైన వాక్యరచనా విభేదాలెన్నో వీధ్యంగాలలోను సంధ్యంగాలలోను పేర్కొన్నారు. ఉదాహరణకు, ప్రియవచనాలవంటి అప్రియవచనాలు పలికితే ఛలనం అనే వీధ్యంగం ఏర్పడుతుంది.గణపతిని ప్రార్థిస్తూ విఘ్నకార్యదీక్షవఘనిన్, గిరాతసుతు. సామజ వక్త్రుని వక్రహస్తు.దాంతావను నేకదంతుని దృణాంచితు మూషికసాదినెంచదన్ అనేచోట వాడిన శబ్దాలన్నీ బయటకు పొగిడినట్లుగానే ఉంటూ లోలోపల వెక్కిరిస్తున్నట్లుంటాయి. ఇలాగే మాటకు మాటగా తటాలున యిచ్చే జవాబులోగల హాస్యోక్తికి నాళిక అని పేరు. చిలకమర్తివారి ప్రసన్న యాదవనాటకంలో నరకాసురుడు ఊర్వసిని మోహించి తన దర్బారుకు పిలిపిస్తారు. ఆమె ఏదో ముసలిదానినని స్వర్గవిజేత యైన నరకునికి తగిన సరసురాలను కానని చెప్పి తప్పించుకోబోతుంది. ఆసందర్భంలో ప్రక్కనున్న వజ్రకంఠుడు (నరకునిబంటు) అయ్యో యిది సరసురాలు కానట్లు నటించుచున్నది గాని సరసము లేకపోలేదు. ఇది ఎనెన్నో కొంపలు గాల్చిన కొఱవిగాని సామాన్యురాలుకాదు. అని వ్యాఖ్యానిస్తాడు దానికామె చీదరించుకొని ఇంద్రునియందు గౌరవమునకైనా తనను లోకమాతగా పరిగణింప వలసినదని అన్నప్పుడు వెంటనే అతడు అట్లయిన నీవు మాపాలిటి పెద్దమ్మవు అని ఈసడిస్తాడు. గూఢంగా ఉపాలంభనకు ఉద్ఘాత్యకమని పేరు ఇదే ప్రసన్న యాదవనాటకంలో స్వర్గవిజేతయైన నరకునికి ఇంద్రుడు స్వాగతమివ్వబోతాడు. అతనిని చూచి నరకుడు ఎవరు వీరు? నముచి గర్వనిరాపణ ధూర్వహులు. పాత

పాక ప్రతాప గంధసింధుర వంచాననులు బలప్రాణానిలకాల భుజంగులు నగు నహల్యా భుజంగులా? అని పలకరిస్తాడు. స్వర్గసింహాసనము నధిష్టింపుమని పల్కిన బృహస్పతితో కూడ నరకుడిదేవిధంగా ఇయ్యది మెక్కువాడు తాగన్నులు వేయి దాల్పువలె గౌతమునింటను గోడి గావలెన్ అని ఎత్తిపొడిచి మాటాడుతాడు.

హాస్యం వికృతిని పురస్కరించుకొని యేర్పడుతుంది. ఉన్నది ఉన్నట్లుగా ప్రకృతి సహజంగా ఉండవలసి నట్లుంటే నవ్వురాదు. ఆ ఉన్న దాంట్లో కొంత లోపమో, వంకరో, పట్టుతప్పిజారిన పరిస్థితియో, ఏదో ఒక విధమైన వికారమో, వికృతియో రావాలి. అప్పుడే నవ్వుకి ఆస్కారం. అదేహాస్యానికి ఆలంబనం

వికృతాకార వాక్చేష్టం యమాలోక్యహసేజ్జనః
తదత్రాలంబనం ప్రాహుస్తచ్చేష్టోద్దీపనం మతమ్.

వికృతమైన ఆకారం, వికారమైన చేష్ట, సందర్భ శుద్ధిలేని మాటలువంటివి ఎందులో గమనించి మనం నవ్వుతామో అదే హాస్యానికి ఆలంబనం, ఆమీద అక్కడ ఏర్పడిన క్రియాకలాపాదులన్నీ హాస్యాన్ని పెంపు చేసే ఉద్దీపనలు. కాగా, హాస్యానికి వికృతి మూలాధారమనీ హాస్యరసం ఆలంబన ప్రధానమైనదనీ స్పష్టం. వికృతి ఇతరులలోనే కాదు, మనలో కూడ వుండవచ్చును. ఒకరిలోపాలు చూసి నవ్వినట్లే మనం మనలోవచ్చిన లోపాలు పొరపాట్లు కూడ గమనించి నవ్వుకుంటాం. కాగా, హాస్యం ఆత్మస్థముగాను పరస్థముగాను కూడా శోభిస్తుంది. కనుకనే

ఆత్మనః పరస్యేవా యేవేష భాషాకార, విరుద్ధాలంకార
అస్పష్ట భాషణ, కబ్జిత్వాదయ స్తద్దర్శన, శ్రవణజన్య
మనోవికారో హాసః అని హాస్యాన్ని నిర్వచించారు.

మనలోగాని యితరులలోగాని వికృతమైన వేషభాషాదికం అప సవ్యమైన అలంకరణం, అస్పష్టమైన మాటల తీరు, మరుగుజ్జుతనం వంటివి చూసినా వినినా మన మనస్సులో జనించే భావవికారానికే హాస్యమని పేరు. ఇవన్నీ హాస్యానికి ఆలంబనలే అని ముందే చెప్పాము అందుకే నాటకాదుల్లో హాస్యానికి ఆలంబనగా విదూషకుడనే పాత్రను సృష్టించారు అతడు సాధారణంగా బ్రాహ్మణుడు.చదువు సంధ్యలంతగా లేకపోయినా సందర్భానుసారంగా మసలుకొని బ్రతకనేర్చినవాడు. నాయకునికితడు ప్రియవయస్యుడు. నాయికలవద్ద యిచ్చకాలమారి. చెలికత్తెలతో జగడాలకోరు. తిండిపోతుతనానికెంతో పిరికితనానికి తెలివి తక్కువతనానికి కూడ అంతగానే ప్రసిద్ధుడు.

కుసుమ వసంతాద్యభిదః కర్మవ పుర్వేష భాషాద్యైః
హాస్యకరః కలహరతి ర్విదూషకః స్వకర్మజ్ఞః

అని చెప్పిన లాక్షణికులు ఇతనికి స్వకర్మ ఏది? అని అంటే భోజనాది అని స్పష్టంజేశారు.

ఈవిధమైన తెలివి తక్కువ దద్దమ్మలు, తిండిపోతులు, ఎద్దు మొద్దు స్వరూపాలు అయిన విదూషకులు సంస్కృత సాహిత్యం నుండి సరాసరి తెలుగులోకి దిగినవారెందరో ఉన్నారు. ప్రతిపక్షనాయకుని వద్ద నున్న వయస్యులు, బంట్లు వగైరాలు కూడ ఈజాతి, ఈపేరు. కాక పోయినా యిదే తీరులో కనిపిస్తారు. వీరిలో పిరికితనంతోపాటు దాష్ట్యం కూడా గూడుకట్టుకో నిలుస్తుంది.

హాస్యంలో ఉన్నమరో విశేషమేమంటే దీనికి తక్కిన రసాలకు వలె ఆశ్రయాపేక్షలేదు. శృంగారంలో నాయికా నాయకులు,వీరరసంలో నాయక ప్రతి నాయకులు పరస్పరం ఆశ్రయాలంబనాలుగా వుంటారు కాని హాస్యానికి ఆలంబన మొక్కటేచాలు. ఆశ్రయమంటూ వేరొకటి

వున్నా లేకపోయినా ఫరవాలేదు. సందర్భాన్నిబట్టి సామాజికులే దీనికి ఆశ్రయమౌతారు.కవినే ఆశ్రయ విభావంగాభావించినా దోషంలేదు. ఇందు చేతనే హాస్యం ఒకప్పుడు తటస్థంగావుండి తటాలున బైట పడుతుంది. గయోపాఖ్యానంలో శ్రీ కృష్ణుడు తన అంజలిలో ఉమ్మివేసిన ఆ దురాత్మణ్ణి సంహరించి తీరతానని శపథం చేస్తాడు. ఉన్నట్లుండి వాతావరణం గంభీరంగా మారిపోతుంది. కాని శ్రీ కృష్ణునిలో కనిపించిన యీరౌద్ర రసాన్ని సామాజికులు వెంటనే ఆమోదించలేరు.కాని గయునిపట్ల కరుణ చూపడానికైనా వారికవకాశంలేదు. ఈరెండు రసాల్లోను ఏదీపొందక విమూఢచిత్తులై చూస్తూన్న దర్శకులు ఊపిరాడని పరిస్థితిలో పడతారు. అదేసందర్భంలో విదూషకుడు ఆ ఉమ్మివేసినది తాను కాదుగదా అని సంశయం ప్రకటించేసరికి దర్శకులంతా ఒక్క పెట్టున నవ్వి బరువు తీర్చుకుంటారు. ఇలాతటస్థంగా ఉండి బయటపడిన ఈహాస్యంలో ఏదో పొరపాటుగా జరిగిన దానికింత రాద్ధాంత మెందుకనే ధ్వనికూడవుంది. ఇదేనాటకంలో పాండవులు తనమాట వినలేదని అర్జునుని పట్టుదలను ధర్మరాజుకూడా మాన్పించక పోవడంతోపాటు నీతులు చెప్తున్నాడని విని శ్రీకృష్ణుడు మరింతగా మండిపడతాడు. ఆకోపంతో ధర్మరాజును దూషిస్తూ 'పేరు ధర్మరాజు పెనువేప విత్తంద్రు మాట తేనేతేట మనసు విషము' అని అంటాడు. ఇది కూడ ప్రేక్షకులకు మ్రింగుడు పడని కోపమే. ఆసందర్భంలో ప్రక్కనున్న విదూషకుడు. అంత కపట ముండుట చేతనే వారికరణ్యవాసము కలిగినది. అని అనేసరికి ప్రేక్షకులు నవ్వాపుకోలేరు. ఈవిధమైన హాస్యం భావ విశ్రాంతికి (Relief) తోడ్పడుతుంది.

హాస్యం రసంగానేకాదు రసాభాసగాకూడా రసానుభూతి నిస్తుంది ప్రధాన రసాన్ని మ్రింగేసినట్లున్న అంగరసం రసాభాసకే త్రోవదీస్తుంది అందుకే హాస్యాది భూయిష్ఠా శృంగారాదయ ఆభాసీభవంతి అని చెప్పారు. అలాగే అనౌచిత్యాద్ర సాభాసః అని వెల్లడించారు అనౌచిత్య మనేది ఒక వికృతి వికృతియేదైనా సరే అది హాస్యానికే ఆలంబనం

అందుచేత ఏరసంలోనైనా రసాభాస ఏర్పడితే చాలు హాస్యం చోటు చేసుకుంటుంది. హాస్యానికికూడ రసాభాస ఏర్పడవచ్చు. మాన్యులు పెద్దలు, దేవతలు వగైరాలపట్ల ప్రదర్శించే ఉపహాస పూరితాలైన ప్రసంగాలన్నీ హాస్యరసాభాసకే ఉదాహరణలు. కాని హాస్యరసాభాస కూడా హాస్యం గానే ఉపకరిస్తుంది. తిలోత్తమ నాటకంలో ఆమె శంకరుని వరునిగా గ్రహించరాదా అన్నప్పుడు, నిండు మగతనంబు నెఱసున్నవానికి, బొల్లివిరిసినట్టి తెల్లమేను, తిరిపె మెత్తకండ దినమైన గడవదే. ఏమిజూచి వలతు వామదేవు, అని ఈసడిస్తుంది.

హాస్యానికున్న మరోలక్షణం సాంక్రామికత్వం. ఒకరునవ్వుతూ వుంటే చూసి మనం నవ్వుతాం. అవతలి వారెందుకు నవ్వుతున్నారో మనకి వెంటనే తెలియనక్కరలేదు. అందులో ఉన్న సంగతి సందర్భాలు గాని సహజత్వా సహజత్వాలుగాని సబబు, బేసబబులుగాని మనమంతగా గమనించం. వెర్రివాడి వెంటబడి వీధిలో పిల్లలు చప్పట్లుకొట్టి అల్లరిచేస్తూ ఒకప్పుడు రాళ్ళుకూడా రువ్వి నవ్వుకొనేది ఈ విధమైన హాస్యమే. ఇదేవిధంగా ఎవరినైనా ఒకరు ఈసడించి ఎత్తిపొడిచి కమ్మలు కట్టి ఏడిపించి నవ్వినప్పుడు కూడా వేరొకరు అదేతీరులో వ్యవహరించి నవ్వడంకూడ కనిపిస్తుంది. ఇదొక విధమైన క్రూరవినోదం. దీనిలో ఒకప్పుడు కక్ష, కసీ ఏర్పడవచ్చును. సమాజ సంస్కారపరమైన హాస్యప్రయోగంలో ఈలక్షణాలు ఒకప్పుడు మితిమీరు తుంటాయి కూడ కాని నిరుద్దేశ్యమైనచోట వెర్రివాడి వెంటబడి అల్లరిచేసే పిల్లల హాస్యంలోవలె తాత్కాలికానందమేగాని మరోధోరణి కనిపించదు. వేదంవారి ప్రతాప రుద్రీయంలో పిచ్చివానిపాత్రలోను అతని వేష భాషా చేష్టాదికంలోను ప్రదర్శించిన హాస్యానికిదే సూత్రం వర్తిస్తుంది. అతని మాటలలో గల నిగూఢవ్యంగ్యాన్ని గ్రహించిన దర్శకులుకూడా కొంత సేపు ఆహాస్యాన్ని ఆస్వాదిస్తారు. మనకుస్టేజి నాటకాలు వచ్చి నూరు నూటయేభై ఏళ్ళకంటె ఎక్కువ కాలం కాలేదు. అంతకుముందన్నవి వీధి నాటకాలు. వీటిలో హాస్యం ముదురు పాకంలో ఒకప్పుడు అసభ్యతకు

తావిస్తూ అవతరించేదిగా వుంటుంది. ధనవంతుల లోగిళ్ళలో ప్రదర్శించ వలసిన పగటివేష కలాపాలలోకూడ హాస్యముంటుంది. సోమయాజులు సోమిదేవి పంతులు-పథాణి వంటి పగటి వేషకలాపాలు చిన్న చిన్న ప్రహసనాలవంటివి. కాని హాస్య. సమయం సందర్భం గమనించి ఒళ్ళు దగ్గరబెట్టుకో నడుస్తుంది ఈతర్వాత వచ్చిన నాటకాలలో ఇటువంటి చిన్నచిన్న ప్రహసనాలు ఒకప్పుడు కథతో అతికినట్లు. ఒకప్పుడ ర్థాంతరంగా అవతరించినట్లు. వచ్చి.కాలయాపనకు.రంగస్థల సౌలభ్యాని ప్రేక్షకుల భావ విశ్రాంతికి తోడ్పడుతూ వుండేవి. ఇవే యీతర్వాత ఫార్సులుగా మారాయి.వీటిలో విదూషకపాత్ర ధారిబఫూన్‌గా అవతరించి అవసరమున్నా మానినా, ఏకట్టు హాస్యమో బజారు హాస్యమో ప్రయో గించి తత్కాలానికి కొంత ఆనందాన్ని చేకూర్చేవాడు.

తెలుగులో మొదటి నాటకకర్తలుగా ప్రసిద్ధులైనవారు కోలాచలం శ్రీనివాసరావుగారు. ధర్మవరం కృష్ణమాచార్యులుగారున్నూ. ఈయిద్దరూ కవులేకాక నాటక సభలు స్థాపించినడిపించిన నాటకరచయితలు. ధర్మవరం వారునటులుకూడ. ఈయిరువురు రచయితలు పౌరాణికేతిహాసాలకుస్థానిక చరిత్రలకు సంబంధించిన ఇతివృత్తాలు తీసికొని ఎన్నోనాటకాలు వ్రాశారు ప్రాచ్య పాశ్చాత్య సాహిత్యతత్వాలు రెండూ సాకల్యంగా తెలిసికొని నటకుల సాధక బాధకాలు రంగస్థలపు మర్యాదలు ప్రేక్షకుల అభిరుచులు అన్నీగమనించి వీరుతమ నాటకాలు రచించారు. అన్ని నాటకాలలోను హాస్యానికంతో యింతో జాగా చేసారు. కేవలం ప్రేక్షకుల మనోరంజ నకు మాత్రమే కొన్ని హాస్యఘట్టాలు జోడించినందున ఆయాచోట్ల ఈ హాస్యం మూలకథకు ఏవిధంగాను సంభందించక. అతుకు కుదరక సంధర్భోచితంగా లేక పోవడం కూడకద్దు. చిత్రనళీయ నాటకంలో సుదేవ పర్ణాదుల పరస్పర సంభాషణలో హాస్యం కేవలం ఉబుసుపోని హాస్యంగానే రూపిస్తుంది అయితే అన్నిచోట్లా యిలాలేదు ఈ చిత్రనళీయంలోనే బాహుకునికి దమయంతి చెలికత్తెతో జరిగిన సంభాషణలో నాటకీయ వ్యంగ్య ప్రధానమైన హాస్యం అతి సరసమైన

తీరులో వెలసింది. బాహుకునిలో దమయంతీ ద్వితీయ స్వయంవరాహ్వాన పత్రికను చదివేటప్పుడు కలిగిన తత్తరపాటు, ఆతర్వాత ఆదేవిషయాన్ని తలచుకొంటూ 'వివాహం పంచమీ బుదువారమని వ్రాశారే. దగ్గయోగం కదా ఇటువంటి పెళ్ళిళ్ళకిటువంటిముహూర్తాలే వుంటాయి కాబోలు'నని అనుకోవడం, ఆరాత్రి నిద్రపోకుండా విరహవేదన పడడం ఆదిగమనించిన సుదేవుడు. బాహుకా నీకు భార్య వున్నదా. అని అడగడం వగైరాలన్నీ నాటకీయ వ్యంగ్య పూరితాలైన హాస్యాన్ని చక్కగా అందించేవే.

కోలాచలంవారి నాటకాల్లోకూడా ప్రేక్షకుల కోసమని సృష్టించిన హాస్యం చాలాచోట్ల కనిపిస్తుంది. ఒకప్పుడిది బలాత్కృతంగా వుంటుంది ప్రహ్లాదనాటకంలో గురుశిష్యుల సంవాదం, వీధిబడి తీరు. వగైరాలలో సందర్భశుద్ధి అటుంచి సహజత్వంకూడా కనబడదు.

వీరేశలింగంగారి రచనల్లో శుద్ధి వ్యంగ్య హాస్యాలు రెండూ వున్నాయి. కానివీరి ప్రహసనాలన్నీ సమాజ సంస్కారాభిలాషతో వ్రాసినవే అయినందున వీటిలో వ్యంగ్యహాస్యం ఆయుధ ప్రాయంగా ఉపయోగపడుతూ వచ్చింది.

సంస్కార విరోధులపట్ల వీరొకప్పుడు తీవ్రవ్యంగ్యాన్ని కటువుగా ప్రయోగించడం కూడా కద్దు. సాహిత్య సంస్కారానికి వ్రాసిన సరస్వతీ నారదసంవాదం వంటి వాటిలో హాస్యం కొంత మృదువుగా వుంది పానుగంటివారి నాటకాలలో ఎత్తిపొడుపు హాస్యం ఎక్కువగావుంటుంది అలాగే వాచాలత వ్యంగ్యంకూడ కనిపిస్తాయి. ఆవ్యంగ్యం కూడ కటువుగానే వుంటుంది. అసభ్యాన్ని అతిశయించి చూపడం కూడా కద్దు వృద్ధవివాహం కంఠాభరణం వంటినాటకాల్లో వీరు ఆనాటి కన్యావిక్రయం వృద్ధవివాహం, విటవాచారం వంటి సాంఘిక దురాచారాలన్నింటినీ వ్యంగ్యంగాను వాచ్యంగాను కూడా అపహసించారు. ఈ నాటకాలలో

కేవలం వినోదం కోసమే కూర్చిన ఘట్టాలు కూడాచాలా దొరుకుతాయి కథను వక్రగతి కీడ్చి అనుకోని విధంగా అంతంచేయడమే కాక అంతటా అల్లరి. యుక్తి. దగా. మోసం. తిరుగుడు వగైరాలు చిత్రిస్తు నాటకాన్ని నడిపేనేర్పు వీరిలో కనిపిస్తుంది.వీరిపాదుక రాధాకృష్ణ వంటి నాటకాల్లో ఏదోఒక పాత్ర విదూషకునిలా అభినయిస్తుంది. నవ్వించ డానికి అనువులు కూర్చి. అందుకనుకూలమైన వంపులోనికి కథను ఈడ్చడంలో వీరి హాస్య ప్రజ్ఞకూడ బాగా గోచరిస్తుంది వీరిది వ్యంగ్య మున్నా సరసతకు సభ్యతకు లోటు రానీయని హాస్యం.

గురుజాడవారి కన్యాశుల్కం కూడ సంస్కారాభిలాషతో వెలసిన నాటకమే. ఇందులో సమాజసంస్కారమేకాదు భాషాసంస్కారంకూడ ఉద్దేశించ బడింది. నాటక కర్త మంచి లౌక్యులు.అతిసరసంగా వ్యంగాన్ని ప్రయోగించగల చతురులు. వీరు దోషాన్ని చూపెడుతారు కాని దానిపై వ్యాఖ్యానించరు. దోషాన్ని తిరస్కరించడంకూడ అంతగా కనబడదు. కన్యాశుల్కంలో వీరు మనకు శాశ్వతంగా అందించిన పాత్ర గిరీశం ఇంగ్లీషులో ప్రేలుపెట్టిన ఈతెలుగు యువకుని సంస్కారాభిలాష వితంతూద్ధరణకే అనేది పాత్ర గత ధ్వని. ఈపాత్రలో ఆనాటి తెలుగు యువకులు కొందరిలో నిండుకున్న ఇంగ్లీషు వ్యామోహం దాన్ని అంతోయింతో నేర్చినవారిడాబు పాపభీతిలేని వర్తనం. చేసిన తప్పునే ఒప్పని సమర్థింపగల లోకకంటకమైన నేర్పు. స్వార్థసాధనకై అల వరచుకొనే చాతుర్యం. అవసరార్థమని పొందే నైచ్యంవంటి గుణాలన్నీ పోతపోసి మరీ అందించ బడ్డాయి. కథలో సనాతనాచారాలు, అతిబాల్య వివాహాలు. కన్యాశుల్కాలు. వేశ్యల మాయలు. జూదగొండుల జగడాలు. నిజాయితీలేని లౌక్యం.నీచాతి నీచమైన వైదికం వంటివెన్నో ఒకచోట సమకూర్చబడ్డాయి. మధురవాణి వాక్చాతుర్యం. ఉక్కా జట్టుడి తంత్రం. కొండు భట్టుస్వార్థ. రామ ప్పంతులు వియోగం. వెంక టేశం చేగోడీ చదువు వగైరాలన్నీ మరవరాని విధంగా తీర్చి దిద్ది మరీ అందించబడ్డాయి. గిరీశం ఉపమాన పాత్రగా తెలుగునాట శాశ్వతత్వం

సంపాదించారు. ఈనాటక రచయిత వ్యంగ్యాన్ని చిటికెలో గ్రహించి చూపగల నేర్పరి. వీరి హాస్యం వ్యంగ్యాన్ని ఆశ్రయించి నడుస్తూన్నా 'అయ్యోపాపం' అనో 'పోనీలే' అనో అనిపించి నవ్విస్తుంది పాత్రలను మూర్ఖులుగా చూపి నవ్వించడమేకాక అల్లరి హంగామా వంటివి ప్రదర్శించికూడ వీరు నవ్విస్తారు. మధురవాణి యింట్లో రామప్పంతులు గిరీశం ఒకరికొకరు తారసపడినప్పటి సన్నివేశంలో పడిన వికారపు పాట్లన్నీ నవ్వుతాలకే.

వీరేశలింగంగారి వలెనే సహజంగానే హాస్యప్రియులైన కవి చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు బ్రహ్మసమాజ మతాభిమానులై ఛాందసాచారులను చక్కదిద్ది సంస్కరించడానికి వీరుకూడా హాస్యాన్నే ఆయుధంగా గ్రహించారు. కాని వీరి రచనల్లో ఎత్తిపొడుపు తక్కువ వీరి ప్రహసనాలు వినోదార్థంవ్రాసినట్లుంటాయి. వీరి నాటకాలలో ప్రాచీన సంస్కృతనాటకాల్లోని విదూషకులు మరోసారి సాక్షాత్కరిస్తారు. ఒక్కొక్కచోట విదూషక తుల్యులు ఇద్దరు ముగ్గురు కనిపిస్తారు. స్వభావదుష్టమైన వక్రతలు చూపెట్టి సంప్రదాయ సిద్ధమైన కట్టు మాటలాడించి పాత్రలలోను పరిస్థితిలోను కూడా వ్యంగ్యాన్ని నిరూపించి వెక్కిరించి సాటులు సామెతలు జాతీయాలువ్యాజోక్తులు వక్రోక్తులు వంటివిగుప్పించి వీరు తమనాటకాల్లో చక్కని హాస్యాన్ని అందించారు వాక్చమత్కృతి వైవిధ్యం వీరి హాస్య రచనకు ముఖ్యలక్షణాలు. వీరి రచనలలో ఆనాటివరకు తెలుగులో వచ్చిన సాంప్రదాయిక హాస్యమే కాదు, అప్పటికి తెలుగునాట ప్రచారంలోవున్న వినోద ప్రసంగాలు, వికటోక్తులు, కట్టుకథలు కల్లబొల్లి కబుర్లు వంటివాటిలోగల ముడిసరుకు హాస్యమంతా చోటుచేసి కొంది. తెలుగువారిజాతీయ హాస్యమంతా ఈ రచనలలో లిపి బద్ధమైంది. వీరి వాక్యాలు కొన్ని ఈతర్వాత సామెతలుగా సరసోక్తులుగా ప్రచార మందాయి గయోపాఖ్యానములోని, నీవు నేర్చిన విద్యయే నీరజాక్ష, అనేది ఒక ఉదాహరణ.

గయోపాఖ్యానములోని కౌశికుడు సత్యభామ చెలికత్తె హంస వదికతో వాక్కలహానికిదిగి, ఆమె మంచముక్రిందదూరి చిన్నప్పుడు పగటి వేషాలలో నేర్చిన కుక్కమొరుగు అభినయించి ఆమెచే చావు దెబ్బలు తింటాడు. ద్రేపల్లెకు పోవాలనేసరికి యితనికి పాలు పెరుగుల మీది ఆశఉవ్వెత్తున పెరుగుతుంది. పారిజాతాపహరణములో వైరవునికి శ్రీకృష్ణుని దగ్గర చనువుజాస్తి, తిండిపోతు తనం, ఆడిన మాటల కద్దు చెప్పి సమర్థించుకోబోవడం, కోమటిసాక్ష్యాన్ని పల్కి ఆపద తప్పించు కోవడం వంటివి యితనిలో పరంపరాగత వాసనాబలం వల్ల వచ్చినట్లుం టాయి. కాని యితడు మంచి మాటకారి. సత్యభామచే తాపుతినివచ్చిన కృష్ణుడితనతో 'ఆమెకాలి యందియల బంగారముతో నాతల కిరీటపు బంగారమును వియ్యమొందించినది' అని చెప్పగనే యితడు నవ్వుతూ తన్నినదా? కాని మాధవా, ఆమె పరమమునియని మ్రొక్కితివా? లేక దేవుడా? ఎవరనుకొని మ్రొక్కితివి? వందనా నర్హయగు భార్యకు నీవు సందేహములేక వందనము చేయగా నామె సందేహింపక తన్నుట తప్పేమి? ఆమె నీకు తగినభార్య. నీవామెకు తగినభర్తవుఅని నిష్కర్ష గా నిర్ణయిస్తాడు. శ్రీకృష్ణుడు తన భార్యలను తిరస్కరించి బ్రతిమాలు చుండగా యీ వైరవుడు 'నేనీ బ్రాహ్మణజన్మ మెత్తకుండ శ్రీకృష్ణుని భార్యలలోనొకర్తెనై పుట్టిన యెడల నా ముచ్చట దీరునట్లు బతిమాలించు కొందునుగదా, నన్ను బతిమాలువారేలేరు' అని విచారపడతాడు.

ప్రసన్నయాదవములో వజ్రకంఠ మందపాలులు నరకాసురుని బంట్లు వీరిలో మందపాలుడు మందబుద్ధి. భార్య ముండమోసినదని ఎవరో చెప్పగావిని పెండ్లి చేసికొన్న భార్య అంతగా దుఃఖములో నున్నప్పుడు పరామర్శచేయక పోవుట బాగుండదని చూసి వచ్చిన బుద్ధి మంతుడు 'ఇతనికి రంభ కావలెను' అతని ఊహలో రంభ చక్కనిచుక్క దానిశరీరకాంతి తాటి పేశమువలె పచ్చగానుండును.దాని తలవెంట్రుకలు మసి బొగ్గులో జీడిగింజలో యనుకొనవలయును దాని కొప్పుమాలకాకి వలె.అప్పుడే ఆనము నుండి తీసిన పిడతవలె నల్లనై పెద్దదిగా నుండును

ఆమె అచ్చము బోగముదానివలె నుండును. అని నిశ్చయిస్తాడు.

వజ్రకంఠుని వాక్యాలలో కొంత సందర్భ శుద్ధి కనిపిస్తుంది. సత్యభామతో యుద్ధములో ఊపిరాడకుండ నిలిచిన నరకుని చూచిమందపాలునితో. అదిఆడుది కాదురా బాబు నూరుమంది మగవాండ్రను చంపి పుట్టినది. మతిమాలిన ముండా కొడుకు బ్రహ్మదేవుడు పిడుగువంటి మగవానిని జేయదలచి మరచి ఆడుదానిగా చేసెను ముల్లోకములు జయించిన మనమహారాజుగారి నామె యిప్పుడు ముప్పు తిప్పల బెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించు చున్నది. ఇన్నాళ్ళు బ్రతికి యింటి వెనకాల జచ్చెనన్నట్లు మహేంద్రాదులను గెల్చినదానవ సార్వభౌముడు తుదకాడు దాని చేతబడునేమోనని భయమగు చున్నది. అని పల్కావాపోతాడు.

ఒకరిద్దరు విదూషకులున్నప్పుడు వారిలో వారికి మాటపట్టింపులు వచ్చి చీలి జగడాలకుదిగి బొంకు బింకాలు చూపి నవ్వించడం పరిపాటి తిలోత్తమ నాటకంలో జంబుక శౌనకులు మంజుఘోష అందాన్నిగూర్చి తమలో తాము తగవులాడు కొంటారు. జంబుకుడు స్వర్గంమీదికి దండెత్తిపోవాలంటే ఇక నాకుభార్యచేతి గుద్దులు తప్పినట్లే అని సంతోషిస్తాడు. కాని స్వర్గంలో అతనికేదీ సరిగా నచ్చదు. ఏదో అమృతమందురే గాని ముంతెడు తాటికల్లు గాని యీతకల్లుగాని దొరకదు. నీరుల్లి వెల్లుల్లిలేని లోకము నరకమగును గాని స్వర్గమగునా. అని ఈసడిస్తాడు.

చతుర చంద్రహసలో మంత్రిదుష్టబుద్ధి రాజకుమారునికి చెప్పిన నీతి నేడు మన రాజకీయ నాయకులు బాగా ఎరిగినదే.

వట్టిమాటలనాస పుట్టింప వలయును ఔన్నత క్రియలలో జూపవలయు ఏచేటపన్నులు హెచ్చింపవలయును ప్రజలేడ్వకృపనటింపగవలయును

ఇత్యాది. వేదంవేంకట్రాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయంలో పండితహాస్యం నుండి పామరహాస్యం వరకుగల అన్ని హాస్యవిభేధాలు గోచరిస్తాయి. ఇందులో హాస్యం విశుద్ధకోటికి చెందినది. విద్యానాథుని వాక్చమత్కృతి చెకుముకి శాస్త్రి వ్యంగ్యదోరణి పేరిగాని సహజ స్వాభావిత భాషాశైలి పిచ్చివాని కృతక వాగ్విలాసం మహమ్మదీయ పాత్రల సంకర భాష అన్నీ ఎక్కడికక్కడే ప్రత్యేకత, విశిష్టత చూపి ఆకర్షకాలుగా ఉంటాయి, చెకుముకిశాస్త్రి మహమ్మదీయులతో జరిపినసంభాషణనాటకీయ వ్యంగ్యధోరణిలో నడిచింది. ఈశాస్త్రిగారి వాక్కులొకటి రెండుచోట్ల అశ్లీలతను, అసభ్యతను కూడా ధ్వనించాయి. పేరిగానిపాత్ర ఈ నాటకానికే నాయకపాత్రగా మారింది. పిచ్చివాని మాటలెప్పుడూ హాస్య జనకాలే కాని ఈనాటకంలో పిచ్చి ఎరువుదెచ్చుకొన్న దవడంవల్ల అతని ప్రలాపాలన్నీ హాస్యాన్ని ఔచిత్యపూర్ణంగాను శాస్త్రీయంగాను రూపింపజేశాయి. పదవసరంగులలో పామరహాస్యం వెల్లివిరిసింది ఇందులో హాస్యపుపాటలుకూడ చోటుచేసి కొన్నాయి. ప్రతిపాత్ర భాషలోను తనవర్గంవారికి ప్రతినిధిగా వుంటూనే తనదైన వ్యక్తిత్వాన్ని కూడా నిలబెట్టుకుంటూంది. గంభీర భావభరితమైన వాతావరణంలో నడిచే ఈకథలో హాస్యం వింతగానో వినోదంగానో విశ్రాంతికి తోడ్పడు తుంది పైగా ఈ హాస్యం కథాగతికి చేయూత నిస్తున్నందున అత్యంత సందర్భోచితంగావుంటూ మితిమీరిన చోటకూడా మూలానికి ముప్పురా నీయలేదు. వాస్తవానికి హాస్యం కోసం కాకుండా కథాగతిని ముందుకు నడిపించేదిగా అందించబడింది.

కాళ్ళకూరి నారాయణరావుగారి నాటకాల్లో హాస్యం చాలావరకు సరసంగాను సందర్భోచితంగాను వెలసింది. చింతామణిలో సుబ్బిశెట్టి హాస్యోపమాన పాత్రగావెలసేదు. వరవిక్రయంలో లింగరాజుగారుకూడ హాస్యానికి చక్కని ఆలంబనగా నిల్చారు. మధుసేవలో శర్మగారి పాత్రలో హాస్యం యింగ్లీషు తెలుగు కలగలుపు పద్యాలు మాటలు

వగైరాలులో పోషింపబడింది. ఈ కవి హాస్యరచనలో ముఖ్యంగా కనబడేలక్షణం అనుప్రాసలుకూర్చి మాటాడించడం అనవసరమై విసువు పుట్టించే వాచాలతకూడ వీరి పాత్రలలో కనబడుతుంది. మధు సేవలో వెంకటేశం పాత్రలో హాస్యం సభ్యంగానే వుంది కాని సహ్యం గాలేదు. చింతామణిలో నాయిక వేశ్యయేగాని. కవి ఆమెనొక ఉత్తమ పాత్రగా నడిపాడు. వరవిక్రయంలో లింగరాజుపాత్రలో లోభుల లక్షణాలన్నీ గూడు కట్టుకున్నట్లు రూపిస్తాయి. అతడు గల్లాపెట్టెవద్ద లక్ష్మీదేవికి హారతిచ్చి. వెంటనేఊది ఆర్పేస్తాడు తర్వాతవడ్డీవ్యాపారిగా లక్ష్మీదేవిని ప్రార్థిస్తూ "ఏయింటికే నంపినన్ బోయి ఆయిల్లుసర్వంబునన్ నేలమట్టంబుగావించి అచ్చోసమస్తంబునున్ దెచ్చి. నాకిచ్చు చుండంగ దే కన్నతల్లీ నమస్తే నమస్తేనమః" అని తన ఆశయం వెల్లడిస్తాడు.

భమిడిపాటి కామేశ్వరరావుగారి ఏకాంకనాటికలు నవ్వించితీర తామని ప్రతిజ్ఞపట్టి వచ్చినట్లుంటాయి. నేటిసమాజంలో వున్న అహమిక అసూయ అసహనం చేతగానితనం, వృధాభిమానం వంటివి వీరి హాస్యానికాలంబనలు. మునుపటిపద్ధతులు నేటివారికి నేటిపద్ధతులు మునుపటివారికి చూపించి రెండుతెగల వారిని నవ్వించడం వీరి విలాసం. హాస్యసృష్టికై వీరు వాచాలత అతిశయోక్తి అల్లరి మూర్ఖత్వం వగైరాలు ఎక్కువగా గ్రహిస్తారు పాత్రలన్నీ ఒకేతీరులో ఒకే ధోరణిలో మాటాడతాయి ఒక్కొక్కచోట పాత్రనడవడి స్వాభావికంగా ఉండకుండా బలాత్కరించినట్లుంటుంది. అందరూ మూర్ఖులుగానే కనిపిస్తారు. ఈకారణంచేత వ్యంగానికి బలం తగ్గిపోతుంది కూడ సంభవిస్తూంటుంది.

హాస్యం కూడ పరిసరపు రసికభాషనాశ్రయించి కళామయంగా దిద్దిబడి ఉత్తమకోటికి చెందినదిగా లభించదు. కాని నవ్వించడానికి మాత్రం సాటిలేనిదిగా వుంటుంది. మచ్చుకి వీరి 'వేషం తగాదా'లో కొన్నిపంక్తులు చూడవచ్చు. ఇది సభాప్రారంభపు దృశ్యం నవరసరావుగారు అధ్యక్షులు. ఆయనలేచి గ్రాంధిక భాషలో సంగీతరావు గారు వేదికపైకి వచ్చి ప్రార్థన చేయగలరు అని అంటారు. సంగీతరావు నాటకాలలో వేషాలు వేసి రాగయుక్తంగా పద్యాలుపాడగలడు అతడు

వేదికమీదికి వచ్చి 'నిటలాక్షుండిపు డెత్తివచ్చినను రానీ' అని ప్రారంభించే సరికి అందరూగొల్లుమని నవ్వుతారు. కార్యదర్శి శాస్త్రిగారు అతనిచెవిలో దేవుడికి తెలుగురాదు సంస్కృతంలో ప్రార్థన చేయండి అంటాడు. సంగీతరావు 'వెంటనే వృక్షాగ్రవాసీ నచ పక్షిరాజః' అని చదివేసరికి మళ్ళా అంతా ఒక్క పెట్టున నవ్వుతారు. శర్మగారు 'జనగణమన' పాడండి అంటాడు 'అందులో ఆంధ్రదేశం పేరుగాని కృష్ణా గోదావరీనదులస్మరణ గానిలేదు'. అంటాడు శాస్త్రిపోనీ. వందేమాతరం. పాడండి అని శర్మ గారంటే దేవుడిమీదనైతే వందే పితరం పాడాలి అంటాడు శాస్త్రి సరే గాని శ్రుతిలేదు కనుక నేనిప్పుడు పాడనని సంగీతరావు వేదికదిగిపోతాడు ఏరిఏకాంకి లన్నిటిలోను ఈ విధమైన మూర్ఖహాస్యం గూడు కట్టుకో నిలుస్తుంది. కథాంతం సంభావ్యంగాను సరసంగాను ఉన్నా ఘటనలన్నీ అసహజంగాను అల్లరి చిల్లరగాను అతివాస్తవికంగాను ఉంటాయి.

ఏకాంకిలు. నాటికలు నేడింకా ఎక్కువగా వస్తున్నాయి హాస్యం కూడ తగు మాత్రం సరసంగానే పోషింపబడుతూంది.ముందు ముందింకా సరసతగల హాస్యం రాగలదని ఆశిద్దాము.

